# కవితా కళ్యాణి

డా॥ రాఘవేంద్ర ప్రసాద్
సూద్నగుంట
లాస్ ఏంజలస్ . కాలిఫోర్నియా



# కవితా కళ్యాణి

(కవితా సంపుటి)

రచన

**డా॥ రాఘవేంద్ర ప్రసాద్**




**కిన్నెర పబ్లికేషన్స్**

2-2-647/159, సెంట్రల్ ఎక్సైజ్ కాలని

హైదరాబాద్ - 500 018

**కవితా కళ్యాణి**
(కవితా సంపుటి)

రచన : **డా॥ రాఘవేంద్ర ప్రసాద్**

ప్రథమ ముద్రణ : జూలై 1987
ద్వితీయ ముద్రణ : ఏప్రిల్ 2019
ప్రతులు : 1000
వెల : అమూల్యము

ముఖచిత్ర చిత్రణ
మరియు బొమ్మలు : బాపు

ప్రతులకు : డా. సూద్నగుంట రాఘవేంద్రప్రసాద్
ఫోన్ : 7893412166
ఈ–మెయిల్ : prasadrs27@hotmail.com

ముద్రణ : రైయిన్‌బో ప్రింట్ ప్యాక్
అమీర్‌పేట్, హైదరాబాద్
ఫోన్ : 040–23731620

కళాప్రపూర్ణ
**డాక్టర్ దాశరథి.** డి. లిట్.

104-(సి. బ్లాక్), మాతృశ్రీ మందిరం,
హైదర్ గూడా, హైదరాబాదు - 500 029

# కవితా కళ్యాణికి స్వాగతం

ముఖేముఖే సరస్వతీ అన్న మాట సత్యం. సప్త సముద్రాలు దాటివెళ్ళినా ఒక సంస్కారవంతుడైన వ్యక్తిలో తన భాష, సాహిత్యం, లలితకళలు, సంప్రదాయం పట్ల అభిమానం పోదు. అందుకు నిదర్శనంగా డా॥ రాఘవేంద్ర ప్రసాద్ గారినే చెప్పవచ్చును.

వారు యెంతో కాలంగా అమెరికాలో వైద్యవృత్తిలో వుంటున్నా తెలుగు గడ్డను మరువలేదు సరిగదా తెలుగు వీణను పలికిస్తున్నారు. 1985లో లాస్ ఏంజెలస్‌లో జరిగిన అయిదవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో పాల్గొన్నప్పుడు నేను వారిని కలుసుకున్నాను. చాలా విజయవంతంగా ఆ సభలు జరిగాయంటే అందుకు డా॥ ప్రసాద్ గారు, వారి సహచరుల నిర్విరామ కృషే కారణం.

ప్రసాద్ గారు తన అభిప్రాయాలను కవితా రూపంగా వ్యక్తపరుస్తున్నారు. సాహిత్యంలో శతాబ్దాల నుంచి కవితకు ఉన్నత స్థానం వుందన్న విషయం జగ ద్విదితం.

## కవితను గురించి ప్రసాద్ గారి అభిప్రాయాలు

"రమ్మనిన రాదుకదా! ఆగమనిన ఆగదది" కవిత స్వతస్సిద్ధంగా హృదయంలోనుంచి పొంగుకొని వస్తుంది. ఇది సత్యం.

కవి కవితా రచన చేయకుండా వుండలేడు. డా॥ ప్రసాద్ గారు వృత్తి రీత్యా వైద్యులైనా, ప్రవృత్తి రీత్యా కవులు.

పూర్వం వైద్యులు కవులుగా వుండేవారు. ఆ సంప్రదాయం డా॥ ప్రసాద్ గారిలో చూస్తున్నాను. నేటికి గూడా బెంగాల్ లో వైద్యుణ్ని కవిరాజు అంటారు.

"సద్వైద్య జీవనమ్'' అనే పేరుగల వైద్య గ్రంథం రచించిన రోలంబ రాజు వైద్యుడేగాక కవిగూడా. "నిర్మలమైన మదిలో పెల్లుబికే తరంగం కవిత'' అన్నారు డా॥ ప్రసాద్ గారు. ఇది వాస్తవం.

డా॥ ప్రసాద్ గారి నిర్మల హృదయంలో నుంచి యెన్నో కవితలు వెలువడ్డాయి. వాటి సంపుటమే ఈ " కవితా కళ్యాణి ".

ముఖ్యంగా నన్ను ఆకర్షించిన విషయం డా॥ ప్రసాద్ గారి హృదయం లోని "ఆవేదన". విదేశాలలోని తెలుగు పిల్లలు తమ భాషనూ, సంస్కృతిని మరిచి పోతారేమో అనేదే ఆ ఆవేదన. మాతృభాషను మరవడం, మాతృమూర్తిని మరవడం కంటే ఘోరం. అమెరికాలో జపాను వారు తమ మాతృభాషను మరువరు.

శక్తికొలది తమ భాషా సంస్కృతులను కాపాడుకోవాలనే ఉద్దేశ్యంతో పూజ్యులు డాక్టర్ కాకర్ల సుబ్బారావుగారు, వారి సహచరులూ అమెరికాలో ఉత్తర అమెరికా తెలుగు సంఘం "తానా" ఏర్పాటు చేశారు. రెండేడ్లకొకసారి ఈ సభలు జరుగుతున్నాయి. న్యూయార్కు, డెట్రాయిట్, షికాగో, వాషింగ్టన్, లాస్ ఏంజలస్‌లో ఇప్పటికి అయిదు మహాసభలు జరిగాయి. అక్కడి తెలుగు ప్రజల ఉత్సాహం శ్లాఘా పాత్రము. మన దేశం నుంచి కవులను, గాయకులను, చిత్రకారులను, నాట్యాచార్యులను ఆహ్వానిస్తున్నారు. కనుల పండువుగా సభలను జరుపుకుంటున్నారు.

డా॥ ప్రసాద్ గారి కవితలో, ప్రసాదగుణం వుంది. కవితా గుణములు పది. వీనిలో ప్రసాద గుణము రెండవది. ఓజః, ప్రసాదములు కలసి యుండుట పూర్వ రచనలలో కాన్పించును. కాని డా॥ ప్రసాద్ గారి రచనలో ఓజస్సు కన్న ప్రసాద గుణమే హెచ్చు. అందులకు వారి "అమ్మ" అనే కవితను ఉదాహరణగా చూపవచ్చును :–

"త్యాగం అనే వేళ్ళమీద
మమతలనే మానుమీద
ప్రేమ అనే కొమ్మ పై
పాపలనే పక్షులకు
యిల్లు అనే గూటిలో
మమకారపు వేడిలో
కాపాడును తన కొదమల
ఎంతో మరి ప్రీతితో"

మాతృప్రేమను ఇంత మనోహరంగా వర్ణించిన డా॥ ప్రసాద్‌గారి కవితలో ప్రసాద గుణమే హెచ్చు.

కొన్ని సందర్భాల్లో ఆయన ఓజస్సును ప్రదర్శించడం కూడా కలదు. మనకు స్వాతంత్ర్యం వచ్చిన మాట నిజమే. కాని అది కొన్ని సందర్భాల్లో సద్వినియోగం కానందుకు బాధపడుతూ "స్వాతంత్ర్యం" అనే శీర్షికన కవిత వ్రాశారు. ఇందులో ప్రసాద గుణంకన్న ఓజోగుణం అధికంగావుంది. వాస్తవం చెప్పవలసి వచ్చినప్పుడు కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం ప్రసాద్ గారి పద్ధతి. "సిగ్గు" అనే శీర్షికలో వ్రాసిన కవిత కూడా అట్టిదే.

డా॥ రాఘవేంద్ర ప్రసాద్ గారిని అభినందిస్తున్నాను. వీరి లేఖిని నుండి మరిన్ని కవితలను ఆశిస్తున్నాను.

ఈ కవితా సంపుటిని ప్రచురించిన కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ వారికి, ముఖ్యంగా అధ్యక్ష కార్యదర్శులైన శ్రీ యం.వి. నారాయణరావు గారికి, శ్రీ మద్దాళి రఘురామ్, గారికి నా శుభాకాంక్షలు. "కవితా కళ్యాణి" కవితా సంపుటి బహుళ జనాదరణ పొందగలదని విశ్వసిస్తున్నాను.

చదువులతల్లి సరస్వతి చేతిలోని తెలుగు వీణ డా॥ రాఘవేంద్రప్రసాద్ గారి కవితా కళ్యాణిగా దశదిశల శ్రావ్యములైన రమ్యరాగములను పలికించుగాక.

లాస్ ఏంజలస్‌ను "ఒలింపిక్ ప్రతిభల దేవతా నగరం"గా అభివర్ణించారు డా॥ ప్రసాద్ గారు. అక్కడ గడిపిన ప్రతిక్షణం మరుపురాని మధురానుభూతిని మాలో కలిగించింది.

"సుస్వాగతం" అనే కవితలో ప్రసాద్ గారు ఆ వివరాలు తెలిపారు.

"అంతరించబోనీకు నీ భాష, నీ సంస్కృతి" అని ఒక కవితలో ప్రసాద్ గారు హెచ్చరించారు అమెరికా తెలుగు వారిని. కవితా కళ్యాణి సర్వదా ప్రజా హృదయాలలో కళ్యాణ గీతాలను పలికించుగాక. కవితా కల్యాణికి సుస్వాగతం.

ప్రభవ సంవత్సర వైశాఖ పౌర్ణమి — **దాశరథి**



# మా మాట

1977లో స్థాపించబడ్డ కిన్నెర ఎన్నో సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించింది. నృత్య, నాటిక, సంగీత కార్యక్రమాలు, కవిసమ్మేళనాలు, చర్చాగోష్టులు, జాతీయ స్థాయిలో, నాటక పోటీల నిర్వహణ, యువ రచయితలకు ప్రోత్సాహం వివిధ రంగాలలో ప్రముఖులకు సన్మానం, ఇలా సాంస్కృతిక రంగాన్ని కిన్నెర సస్యశ్యామలం కావించింది. సాహిత్యరంగంలో క్రొత్త రచనలను ఆహ్వానించి. 25పుస్తకాలను ప్రచురించడం కిన్నెర కడుపున బంగారు పంటను పండించడమే.

కళలకు భౌగోళిక ఎల్లలు లేవని కిన్నెర నిరూపించింది. కిన్నెర ఆర్ట్ థియేటర్స్ జంటనగరాలలోనే గాక, రాష్ట్రమంతటా దేశమంతటా అంతర్జాతీయంగా కీర్తి ప్రతిభలను గడించుకొంది. కిన్నెర సభ్యులు 1983లో మలేషియా, సింగపూర్, బ్యాంకాక్‌లలో సాంస్కృతిక పర్యటన ముగించిన తర్వాత మరల 1987 మార్చి నుండి మే నెల వరకు బ్రిటన్, అమెరికా దేశాలలో, అక్కడ తెలుగు సంస్థల ఆహ్వానంపై వెళ్ళి ఎన్నో నృత్య, సంగీత కార్యక్రమాలు ఇచ్చి అంతర్జాతీయ ప్రశంసలను ఆర్జించుకొన్నది.

కిన్నెర ఆర్ట్ థియేటర్స్, కిన్నెర ఎడ్యుకేషనల్ అండ్ కల్చరల్ ట్రస్టును నెలకొల్పింది. మూలధనం మీద వచ్చే వడ్డీతో మరెన్నో ప్రచురణలు తేవాలని సంకల్పిస్తున్నది. దానికి కళా హృదయులు సహాయసహకారాలు అందిస్తారని ఆశిస్తున్నాము.

– **యం. వి. నారాయణరావు,** (ఐ.పి.యస్.)

రిటైర్డ్ అధ్యక్షులు

Prof. **C. NARAYANA REDDY**
M.A., Ph.D., D. Litt,
6-3-645, Somajiguda, Hyderabad-500 482 (A.P.)
Vice-Chancellor
Andhra Pradesh Open University Date : 7-7-1987

# అభినందన

'నిర్మలమైన మదిలో పెల్లుబికే తరంగం కవిత' అంటాడు డా॥ రాఘవేంద్రప్రసాద్. కవిత్వానికి ఇది మౌలిక నిర్వచనం. అయితే పొంగును బట్టీ, ఉరవడనిబట్టీ ఆ తరంగానికి విలువ. డా॥ రాఘవేంద్ర ప్రసాద్ అమెరికాలో స్థిరపడ్డా తెలుగును మరవని స్వాభిమాన భూషితుడు. అందుకే తనకు కలిగిన స్పందనలను, సంవేదనలను కవితారూపంలో ప్రకటిస్తున్నాడు.

ఈ కవితల్లో ఎగిరే గుణం కంటే నడిచే గుణం అధికం. అంటే కాల్పనికత కంటే సహజత ప్రధానమన్నమాట. తన అభిప్రాయాలను సూక్తిసుందరంగా ప్రకటించిన రాఘవేంద్రప్రసాద్ కు నా అభినందన. ఈ సూక్తి గుణమే మరింత సునిశితంగా, ధ్వని ప్రాయంగా వెలువడుతుందని నా ఆకాంక్ష.

**డా. సి. నారాయణ రెడ్డి**



# కిన్నెర మాట

'దేశభాషలందు తెలుగు లెస్స' అన్నాడు ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలు. ఈ కాలం తెలుగువారికి అనుకూలంగా వుంది. ప్రపంచ చరిత్రని సృష్టించి ప్రత్యేక ప్రాతినిధ్యంతో తెలుగువారు తలెత్తుకొని సగర్వంగా ఆత్మవిశ్వాసంతో సగౌరవంగా తిరుగుతున్న కాలమిది. జాతితోపాటు భాషకూడ సుసంపన్నమవుతుంది. అనేక ఉత్తమ రచనలు వస్తున్నాయి. తెలుగుకీర్తి ఖండాంతరాలకు వ్యాపిస్తూవుంది. ప్రకాశంజిల్లాలో పుట్టి, అమెరికాలో వైద్యవృత్తిలో స్థిరపడి, అక్కడి తెలుగు సంస్కృతికి, తెలుగు భాషకి, తెలుగువాళ్ళ సమైక్యతకి కృషి చేస్తూన్న వ్యక్తి, నేటి రచయిత అయిన డా॥ రాఘవేంద్రప్రసాద్ నార్త్ అమెరికా తెలుగు సంఘం (TANA) కన్వీనర్ గా అధ్యక్షులుగా, గత నాలుగేండ్లుగా ఎంతో కృషిచేసిన వ్యక్తి డా॥ రాఘవేంద్రప్రసాద్ గారు.

కిన్నెర సాంస్కృతిక బృందం అమెరికాలోని వివిధ ప్రదేశాలలో సంగీత, నృత్య కార్యక్రమాలు ఇచ్చి. అమెరికాలోని తెలుగువారి మెప్పు పొందటానికి ముఖ్య కారకులు డా॥ రాఘవేంద్రప్రసాద్ గారు.
అంతటి మహోన్నత కళాహృదయులు, కవి డా॥ రాఘవేంద్రప్రసాద్ గారు తమ కవితా సంపుటి 'కవితా కళ్యాణి'ని ప్రచురించటానికి మాకు అనుమతినివ్వటం కేవలం మా అదృష్టం.

1980లో కిన్నెర పబ్లికేషన్స్ ప్రారంభించిన తర్వాత నేటివరకు సహృదయనైవేద్యంగా అందించిన 25 పుస్తకాలు రసజ్ఞలోకాన్ని ఆకట్టుకొన్నా, ఇలా ఒక రచయిత, ముఖ్యంగా విదేశాలలో వైద్యవృత్తిలో స్థిరపడ్డ కవి యొక్క కవితా సంపుటిని ప్రచురించడం ఇదే ప్రథమం. ఇది సఫలీకృతమవుతుందని మా ఆశ. ఈ సంపుటికి అందంగా బొమ్మలు వేసిన శ్రీబాపుగార్కి, ముద్రించిన రైయిన్‌బో ప్రింట్ ప్యాక్ వారికి మా కృతజ్ఞతాభి వందనచందనాలు.

– **మద్దాళి రఘురామ్,** కార్యదర్శి

# కవి ప్రతిభాచంద్రికకు అద్దం పట్టిన
# కవితా కల్యాణి

డా. అంతటి నరసింహం M.A, Ph.D.

"కవితా కళ్యాణి" కృతికర్త డాక్టర్ సూద్నగుంట రాఘవేంద్ర ప్రసాద్ (తానా అధ్యక్షులు 1985-87) కవి ఒక్కసారిగా చుక్కతెగిన, వడుపున ఆంధ్ర సాహితీ విశ్వంభరం పైన వూడిపడ్డారు. ప్రసాద్ గారి కవితా కళ్యాణ కింకిణుల ఘల్లులా రావాలు కొత్తగా, హఠాత్తుగా విన్న కవిలోకం ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసింది.

పాతరోజుల్లో, కవిత్వం అంటే పద్యరూపమే. ఈనాడది పద్య, గేయ, వచన కవితారూపాల్లో దర్శనమిస్తున్నది. డాక్టర్ రాఘవేంద్ర ప్రసాద్ గారి 'కవితాకళ్యాణి' ఆద్యంతాలలో వచనకవితారూపంలోనూ, మధ్యలో చాలా భాగం, గేయరూపంలోనూ నడచింది. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈకవి ప్రారంభ దశలో వున్నట్లు కనిపించదు. చాలా ప్రౌఢకవిగా కనిపిస్తున్నారు.

తెలుగు ప్రాంతాలలోనే వుండి, అనునిత్యం తెలుగు మాట్లాడే వాళ్ల మధ్యలో ఉన్నపుడు తెలుగుభాషపై ప్రత్యేకమైన ప్రీతి ప్రదర్శించే అవుసరం అంతగా వుండదు. భిన్నదేశాల్లో వుండి, తెనుగుమాటలు కరువైనచోట మాతృభాషపై గల అభిమానం అగ్రగణ్యమైనది.

డాక్టర్ రాఘవేంద్ర ప్రసాద్ లో మాతృభాషాభిమానం తీవ్రంగావుంది. అంతేగాదు, తెలుగు సాహిత్యమూ, కవిత్వాదులపైన ప్రత్యేక గౌరవమూ, అభిమానమూ వున్నాయి. అందుకే ఆయన ఆంధ్రకవులనూ, తదితర కళాకారులనూ అమెరికాకు ఆహ్వానించడమూ, ఆతిథ్యమీయడమూ, వారి దగ్గర కూర్చుని కవిత్వాదులు వినడమూ జరుగుతున్నది.

భ్రమరకీటకన్యాయంలా డాక్టర్ రాఘవేంద్రప్రసాద్ గారి కవితావేశం కవిత్వరూపంలో వెలికురికింది.మనకవి ప్రసాద్ గారిలో కవి బీజాలున్నాయి. నిరంతరం తన ఆతిధ్యాలను పుచ్చుకొనే కవులనూ, కళాకారులను చూస్తూ

చూస్తూ, వింటూ వింటూ, వారిలా తయారైపోయారు. అదే యీనాడు ఆయన కవి అవటానికి ఉపస్కారకమైన వాతావరణం. కాకపోతే ఆయన యెత్తుకుంటూనే "కవిత" అనే శీర్షికతో ప్రారంభిస్తారా!

*" నిర్మలమైన మదిలో పెల్లుబికే తరంగం కవిత*
*ప్రవహించే లోచనల హృద్వేగం కవిత*
*వికసించే భావకుసుమాల పరిమళాలే కవిత*
*భగభగ మండేగుండెల జ్వాలావేశం కవిత"* అని మొదలు పెడతారా!

కవితావిర్భావానికిగల నేపథ్యం బాగాతెలుసు ప్రసాదుగారికి. ప్రాచ్య, ప్రాశ్చాత్య విమర్శకులు కవిత్వాన్ని, కావ్యాన్నీ యే విధంగా నిర్వచించారో కూడా తెలుసు ఆయనకు.

"వాక్యం రసాత్మకం కావ్యం" అన్నాడు విశ్వనాధుడు.

"రమణీయార్థప్రతిపాదక శబ్దం కావ్యం" అన్నాడు జగన్నాధరాయలు.

పై నిర్వచనాలను ఈ కవి చూచివుండవచ్చు. ఆలోచించి వుండవచ్చు.

"ఆత్మశక్తి పూర్ణమైన రసావేశంయొక్క బాహ్యప్రవాహమే కవిత. కవి ప్రశాంతచిత్తము(సమాధి)లోవున్నపుడు పునరావృతము చెందే భావోద్రేకం నుండి జనించు నిరాటంకప్రవాహమే కవిత." *'Poetry is the spontaneous overflow of powerful feelings that takes its origin from emotion recollected in tranquility'* అన్నాడు వర్డ్స్ వర్త్." రాఘవేంద్ర ప్రసాద్ గారి గేయమూ, వర్డ్సవర్త్ గారి నిర్వచనమూ ఒకే మోస్తరుగా వున్నాయేమో చూడండి.

కవితా నిర్వచనమూ, కవితాప్రాదుర్భావమూ యెరిగిన ప్రౌఢుడీ రాఘవేంద్రకవి. ఆ ప్రౌఢత్వాన్ని బయటకు వాచ్యచెయ్యకుండా, నివురుకప్పిన నిప్పులాగా కనిపించాలన్న గడుసుదనం యిందులో ద్యోతకం అవుతున్నది. దీని సారాంశం సత్యం లాగున ప్రసాదుగారు నివురుకప్పిన నిప్పులాంటికవి అని.అందుకే కవిత్వమంటే యేమిటో,కవిత మొదటే చెప్పారు. ఇక కావ్యం వ్రాయాలిగదా. చాలామంది లాగా దేవుడూ, దయ్యం అని ప్రారంభించ లేదు.

**"మాతృదేవోభవ"** అన్న జగత్ సత్యాన్ని చాటుతూ **"అమ్మ"**అనే శీర్షికతో ప్రారంభించారు.

*"అమ్మ అనేపదం ఎంతో చల్లదనం" అంటూ ప్రారంభించి*
*"త్యాగం అనే వ్రేళ్ళమీద, మమత అనే మానుపైన,*
*ప్రేమ అనే కొమ్మలపై, పాపలు అను పక్షులకు,*
*యింటిలాంటి గూడులో, మమకారపువేడిలో*

కాపాడును తన కొదమల"– అని అద్భుతసత్యాన్ని వ్రాశారు. ఇందులోవాడిన పదాలు అతిసాధారణమైనా, అర్థం అసాధారణమైనది. రూపకాలంకారప్రయోగంతో సర్వప్రాణి సంసారానికి కేంద్రబిందువైన "అమ్మ"ను సాకారంగా ప్రతిష్ఠించారు. అమ్మ అర్థసారాన్ని యింత తేలిక మాటల్లో ప్రతిష్ఠించిన కవి ప్రౌఢుడు కాక మరేమిటి? 'ప్రాణికోటికి(సృష్టికి) ఆధారం ప్రకృతి, దానికి మూలం గూడా ప్రకృతే'. అందుకే ప్రకృతి ఆకారం తల్లి అని అనగలిగారు కవి.

"ప్రకృతి ఆకారం తల్లి, శక్తికి ఆధారం తల్లి
తల్లి అనే ప్రకృతిలో తండ్రి అనే చైతన్యం
కలయిక ఆకృతి రూపం"–

యిది సత్యం కదా, శాస్త్రీయంగా కూడా యింతే కదా. "మాతాపూర్వరూపం, పితోత్తరరూపం. ప్రజా సంధిః, ప్రజాననం సంధానం, ఇత్యధిప్రజం"–అన్న వేదార్థం యిందులో వుంది.

చాలామందికి ఈ కవి అవన్నీ చదవని వ్యక్తిలాగా కనిపించవచ్చు. ఆయన వయస్సు చూచీ, వృత్తిని చూచీ, అలా అనిపించవచ్చు. అయితే శరీర భాగాలనూ, మెదడునూ పరిశీలించి వాటివాటి ప్రవృత్తులను అర్థం చేసుకొన్న ఈ కవికి ప్రాజదువులూ, సంప్రదాయాలూ తెలుసు అనుకోవటం సులభగ్రాహ్యమే.

"ధ్యేయం" అనే శీర్షిక, నిస్వార్థంగా, ధన్యజీవితాన్ని గడపమని ప్రభోదిస్తున్నది. దేవుడిపేరు చెప్పి స్వార్థజీవితం గడపడం,–ఆ స్వార్థానికి దేవుణ్ణి వాడుకోవటం ఈ కవికి గిట్టదు. స్వబుద్ధితో, స్వశక్తితో, పైకెదిగిన

ఈకవి పురుషప్రయత్నమే ప్రధానమని చెబుతూ–

*"మారే ప్రతివస్తువులోనూ చూడు అది అనిత్యం*
*మారని అన్నిటిలోనూ చూడు – అది నిత్యం"* అంటారు

మారేదంతా(బాహ్యరూపం) నశ్వరమనీ, మారనిది (ఆత్మ) నిత్యమనీ, వున్న జగస్సత్యాన్ని (వేదాంతాన్ని) చాటటం ఎంత లోకజ్ఞానం వుంటే వీలవుతుందో ఆలోచించాలి. దేవుడి పేరు చెప్పి కులమతాల పేరున సమాజాన్ని విడదీయటం తప్పు అని ఈ కవి భావం.

*"కులమతాల పేరిట మనలను విభజించేది మాయ (అసత్యం)*
*మానవత పేరిట మనలను కలిపేదే నిజం (సత్యం)"* అంటున్నారు.

"సంఘం–సంస్కృతి" లో, వేర్పు, కూర్పు అన్న పదాల వాడకం తమాషాగా వుంది. వేర్పు అనే పదం ప్రచలితంగా లేకున్నా, మార్పు శబ్దం లాగా వేర్పు అనే పదం వాడడం "నిరంకుశః కవిః" అన్న నానుడిని రుజువు చేస్తున్నది. కూర్పుకు విరుద్ధంగా వేర్పు పద ప్రయోగం బాగావుంది.

*"వేర్పు విభజన, కూర్పు కలయిక*
*కూర్పు ఐక్యత, దైవత్వం"* అని అంటూ ఐక్యతే సంస్కృతికి మూలరూపము అనీ దాన్ని కాపాడుకోవటమే మానవత్వం అనీ తేల్చారు కవి. యిక్కడ వీరి కవిత వచనగేయరూపం నుండి గేయరూపంలోకి అడుగిడింది.

"అంతరించబోనీకు నీ భాషా, నీ సంస్కృతి"అనే శీర్షికలో కవిగారు తనలాగే యితరప్రవాసులు వారి వారి సంతానపు భవిష్యత్ గురించి పడే తపన వ్యక్తమౌతుంది. ఈయన తెలుగు భాషా, తెలుగుదనమూ మరచి పోతామేమో నన్న భయంతో చాలాసార్లు మాతృభూమికి వస్తూవుంటారు. అయితే ఈ దేశంలోని కులభేదాలూ, అస్పృశ్యత, స్వార్ధమూ, దోపిడి, మోసం, కపటం, అశుభ్రత చూచి ఆయన మన సంస్కతి ఔన్నత్యం చాటటంలో మనం మేటి అనీ, కాని దాని ఆచరణలోనే విఫలులమనే హృదయారాటం వ్యక్తమౌతుంది.

"అతిథి"అనే శీర్షిక చూస్తే సిద్ధునికి ఆతిథ్యమిచ్చి సత్కరించిన ప్రవరుడు జ్ఞాపకం వస్తాడు. తెలుగు కవులనూ, కళాకారులనూ అమెరికాలో చూస్తే యెంత ఆనందమో ఈ కవికి. అమెరికావెళ్ళి ఈయన ఆతిథ్యం అనుభవించిన ప్రతి ఆంధ్రకళాకారుడూ సహర్షంగా చెప్పడం నాకు తెలుసు.

"అడుగలేను నేను" అనే శీర్షికలో తన ఎదుగుదలలో సంతృప్తి, అలాగే "ఆరాటం" *"ఏది మార్గమొ, ఏదిగమ్యమొ తెలయదాయె నేడు నాకని"* అనే శీర్షికలలో ఈ కవి ఆధ్యాత్మిక హృదయారాటం వ్యక్తమౌతుంది.

వివాహప్రాప్త అయిన కళత్రాన్ని గూర్చి "కల్యాణి" అన్న పతాక శీర్షికలో చెప్పకుండానే వర్ణించడం జరిగింది. ఈ కవిత బ్రహ్మాండంగా వుంది. ఆమె దేవుడిచ్చిన మల్లెమొగ్గట. మనసు తెలిసిన నిండుసతి అట. మనసు నిండిన వెన్నముద్దట. ఓరిమికి భూదేవి అట. ఆమె వుండే యిల్లు స్వర్గమట. సిరులు నిండిన లక్ష్మీధామమట. యిలా అంటూ ఆ సుఖాన్నీ, ఆ వైభవాన్నీ, నిత్యంగా వుండాలని కోరుకుంటూ, 'నాతోడుగా నిలచివుండు కల్యాణి'గా అని వ్యక్తీకరించారు కవిగారు. ఇది ప్రతిపద సత్యమైన వ్రాత. సార్థక పదప్రయోగం కల వ్రాత. మల్లెమొగ్గ సుందరమైనదీ, స్వశ్ఛవర్ణం కలదీ, సుతిమెత్తనిదీ, సువాసనభరితమైనదీ అని కవిగారికి తెలుసు.

"సతీపతివ్రతా" అనే సంస్కృతార్థం. సతి శబ్దాన్ని పెద్దపెద్ద కవులు కూడా స్త్రీశబ్ధపర్యాయంగా వాడారు కాని, మనకవి సార్ధకంగా వాడారు. యీ సతి, వెంటనే మాతృమూర్తిగా దర్శనమిస్తున్నది కవిగారికి. పాత కామభావ మిపుడు తగ్గి ఆమెను మాతృమూర్తిగా దర్శిస్తున్నాడు. ఇపుడామె బిడ్డలతల్లి. అందుకే ఆమె మెత్తని మనసుగల వెన్నముద్ద అయింది. సహధర్మచారిణియై, యిపుడు ఓర్పులో భూదేవైనదని అంటున్నది రాఘవేంద్రుని ప్రసన్న కవితా హృదయం. ఈ శీర్షికలో ఇన్నిన్ని అర్థాలకు, క్రమం తప్పకుండా సార్థక పద ప్రయోగంతో సాగించిన ఈ కవి కొత్తకవి అంటే నాకు ఒప్పుకో బుద్ధి గాదు.

యింత హాయిగా స్వర్గసుఖతుల్యంగా సంసారాన్ని అనుభవిస్తున్న ఈ కవి, స్వార్థంగా అల్లాగనే నిలచిపోకుండా, మానవసేవ చెయ్యాలనుకోవడం ఆయనలోని మానవతకు చిహ్నం. సుఖాలు నాకు ఒక్కడికే కాదు,

మానవులకంతా పంచాలి అనుకొనేవాడే మహాపురుషుడు. "సర్వేజనా సుఖినోభవన్తు" అని భావించే వాడే మహానుభావుడు. తాను ఏ దేశం నుండి వెళ్ళిపోయాడో, ఆ భూమిని తలచుకొని, దాని బీదరికాన్నీ, అక్కడి వారి వెట్టిచాకిరినీ, దళితులనూ, దౌర్జన్యపీడితులనూ చూచి ఆక్రోశించి, ఆవేదనతో సాగించిన శీర్షికలు "ఆవేశం" "స్వాతంత్ర్యం" "గాంధేయం".

"సుస్వాగతం" "అమెరికా తెలుగు సభలు" అన్న శీర్షికలలో కవిగారి నిష్పాక్షిక ఆనందం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. అమెరికాలో తెలుగుసభలు జరపడానికి ఎవరెవరు ఎంతెంత చేసారో, అందర్నీ పేరుపేరునా తలచుకొని అక్షరాలతో శ్లాఘించడం నిస్వార్థ ఉదారునికే చెల్లు. ఇంతటి ఔదార్యమూ, మాతృభాషాభక్తి, కవి గౌరవమూ, కళాకార ఆదరణా వున్న కవి రాఘవేంద్ర ప్రసాదుగారు, త్వరలో మరింకెన్నో కవితలను పరంపరంగా వెలువరించ గలరని ఆశిస్తూ అభినందనలను పలుకుతున్నాను.






నిర్మలమైన మదిలో పెల్లుబికే తరంగం కవిత !
భగ భగ మండే గుండెల జ్వాలావేశం కవిత?
ప్రవహించే ఆలోచనల హృద్వేగం కవిత!
వికసించే భావ కుసుమాల పరిమళాలే కవిత !
ప్రతి మదిలో నిండివుండు సహజావేశం కవిత !
రమ్మనిన రాదుకదా, ఆగమనిన ఆగదది !



# అమ్మ

తల్లి అనే పదం ఎంతో చల్లదనం
ఎన్నో మమతల గూడే అమ్మ అనే పదం

త్యాగం అనే వేళ్ళమీద ! మమతలనే మానుమీద
ప్రేమ అనే కొమ్మ పై ! పాపలనే పక్షులకు
యిల్లు అనే గూటిలో ! మమకారపు వేడిలో
కాపాడును తన కొదమల, ఎంతోమరి ప్రీతితో

పగలంతా ఎగిరెగిరిన శ్రమనంతా మైమరిచే
రాత్రి చేరే గూడు కదా, తల్లి యొక్క ఒడి

ప్రత్యుపకారం అడగక ఒడలెరగక శ్రమకోర్చి
పది నెలలు నిండుగమోసి, కని పెంచే తల్లి
మరిచిపోవునన్ని శ్రమలు, అమ్మా అనే పిలుపుతో
కరిగిపోవు నామె గుండె, ఒకే ఒక క్షణంలో !

దైవమంటే వినెదము, కనలేము నిండుగయెపుడు
చూడగల్గిన దైవమెపుడు, మన ఎదురుగ వుండుగదా

తల్లియె ప్రత్యక్షదైవం! తల్లియె మన మొదటి గురువు
తల్లియె నమ్మిన మిత్రుడు, తల్లియె మన ప్రియబంధు

ఉగ్గుపాలతో రంగరించి, తను పోసిన విలువలెగద
శివాజీ, గాంధీ, కెన్నడీల, ప్రతిభల మూలమర్మం
తాను మునుగుతూ చేర్చుకదా, ఒడ్డుకు తన పిల్లలను
తాను తరుగుతూ యిచ్చుగదా, వెలుతురు తన కొమ్మలకు !

ఎంతెదిగిన మనిషైనా, అనును కదా నొచ్చినపుడు
అమ్మా ! అమ్మా ! అని, అనుకోకుండా,
ఆ పిలుపుతో పొందుకదా ! పరోక్షపు రక్షణను
రక్షక కవచం తల్లి, ఏ నిముషమునైననూ !

చల్లని గాలులు వీచే చెట్లూ ! చేమలూ
ఎగుడులు, దిగుడులు నిండే, కొండలు, కోనలూ
జలజల, గలగల పారే, నదీ నదాల యొక్క
ఒంపులు సొంపులు నిండిన, సౌందర్యపు నిలయం ప్రకృతి

సృష్టికి ఆధారం ప్రకృతి ! దానికి మూలం ప్రకృతి
ప్రకృతి ఆకారం తల్లి, శక్తికి ఆధారం తల్లి
తల్లి అనే ప్రకృతిలో, తండ్రి అనే చైతన్యం
కలయిక ఆకృతి రూపం, ఇదే కదా మనకు మూలం
జన్మనిచ్చిన తల్లి ఒడి, అవును ప్రకృతి గుడి
గిట్టినపుడు, ధాత్రి ఒడి, అదే ప్రకృతి రూపం
అమ్మ అనే పదం; ప్రకృతి నిండుదనం
అమ్మ అనే పదం; ఎంతో చల్లదనం






మనకై స్వలాభంతో చేసుకునేది గాదు గొప్ప !

సమాజ వికాసానికి నిస్వార్థంగా చేసేదే మెప్పు

మనకై మనం బ్రతికితేగాదు సుఖం !

తోటివానికి సాయపడటంలోనే ఉంది సంతోషం!

ఆటు పోటుల జీవితవలయంలో లేదు సుఖం !

జీవిత ద్వంద్వంలో ఐక్యత చూడగల్గితేనే సుఖం

చేసేవాడిని నేనంటూ, ప్రగల్భించితే దుఃఖం

భగవానుని పరికరంగా ఊహించితేనే సుఖం

గుడి అన్నా , బడి అన్నా వస్తాయి చాల చిక్కులు

మనస్సులోని దృఢత్వాన్ని పరీక్ష చేయుటకేనేమో!

ఆకాశ శిఖరాలను అందుకోవాలనుకున్నావా !

పాతాళపు అగాధాలను చవిచూడాలి నీవు

సంసారం అంటే, భార్యాబిడ్డలనే అనుకునేవు

కోరికలతో, ఉదయించే సుఖ దుఃఖాలే సంసారం !

అశాశ్వతపు ప్రపంచాన్ని నమ్ముకొని బ్రతకబోకు

శాశ్వత ఆనందపు లహరులకై అన్వేషించు

దేవుడెక్కడని, అందరినీ అడగబోకు !

సూర్యోదయంలో, ఆకులలో అన్నింటిలోను చూడు

కదిలే వస్తువులోనే చూడకు మార్పు

రాయిరప్పలలోను, ప్రతి వస్తువులోను చూడు చైతన్యం

మారే ప్రతి వస్తువులోను చూడు అది అనిత్యం

మారని అన్నిటిలోను చూడు నిత్యం!

ఏ పేరిటనైనా మనలను విభజించేదే మాయ

అన్నిటిలోను ఏకత్వం చూసేదే నిజం!

కులమతాల పేరిట మనలను విభజించేదే మాయ

మానవత పేరిట మనలను కలిపేదే నిజం !

నావల్లేమవుతుందని, నేనొక్కడినేనని జంకకు

దైవశక్తి, దైవత్వం ప్రతివొక్కడిలోను ఉంది !

మార్పంటే భయపడి ప్రతిఘటించబోకు నీవు

ప్రకృతి సహజం మార్పు ! ఉపయోగించుకో నేర్పుగ !





# సంఘం - సంస్కృతి

వేర్పు గురుతు ! నేను, నాది
కూర్పు గురుతు, మనం, మనది
వేర్పు విభజన ! కూర్పు కలయిక
కూర్పు, ఐక్యత, దైవతత్వం
మనం, మనది ! సంఘ చిహ్నం
సంఘజీవి మనుజుడెప్పుడు
దీర్ఘ కాలపు, సంఘ జీవన
సరళి, సారం, సంస్కృతి
దాని రక్షణ సంఘ ధర్మం
దాని పోషణ జాతి ధర్మం
ధర్మమును కాపాడునప్పుడు
ధర్మమే రక్షించుగా నిను
అన్నారు పెద్దలు
"ధర్మో రక్షతి ! రక్షితః"
అన్నారు బౌద్ధులు
"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి"




అంతయును నా గొప్పతనమని
విఱ్రవీగకు, భంగ పడుదువు
ముఖస్తుతులకు పొంగిపోకోయ్
దూషణములకు, క్రుంగిపోకోయ్
యుక్తి, శక్తులు దైవ కృపగా
ఎంచినపుడే మేలు నీకోయ్
రోజూ మారే ఈ జగత్తులో
మార్పులేని వాని సేవకు
దైవమిచ్చిన మేధాశక్తిని
వాడుకొనవోయ్, నేర్పుగా నీవు






ఎదిగి తరిగే జీవితంలో
ఏది పుట్టుట ? ఏది గిట్టుట ?
పుట్టగా సంతోషమెందుకు
గిట్టినప్పుడు ఏడ్చు టెందుకు ?
చావు బ్రతుకులు, కాల ధర్మం
చావులేక జన్మ లేదు
ప్రకృతి సహజం, చావు పుట్టుక
రెంటి నొకటిగ చూడవలెనోయ్
ఏడ్వరెవ్వరు బట్ట మార్పుకు
రాలిపోయిన ఫలము కొరకు
ఏడ్చుదురు కాదా ! గిట్టినపుడు
నిజం తెలియక, అంధలోకం !






ఆటుపోటుల ఈ జగత్తులో
ఏది విజయం ? ఏది ఓటమి ?
నేటి ఓటమి రేపు విజయం
నేటి విజయం రేపు ఓటమి
జయం ఓటమి ఒకటి కాదా
నాడు, నేడు, రేపే మార్పిడి
రెంటి నొకటిగ చూసినప్పుడే
నిజం విజయం మనది గాదా !
ఆటు పోటుల ప్రవాహంలో
కొట్టుకొనకోయి చీమలాగా
నిలబడాలి, నీవు నేర్పుగా
కొండలాగా నిండుగా మరి
అపుడే కలదు ! నిజం సుఖం
అపుడే కలదు ! సుఖం నిజంగా






పగటి పూటన కనిన కలగద
నీటి బుడగే జీవితం
కలను నిజమని భ్రమసి పోకుము
నిజము కని చను నేర్పుతో
కొంత మార్గమె నీకు తెలియును
సుదీర్ఘపు ఈ ప్రయాణంలో
ముందు మార్గం నీకు తెలియదు
నీకు తెలియదు గతం మార్గం
సరిచూడవోయి నేటి త్రోవ
ముందు దారి అదే సరిపడు
పూర్వ జన్మ వాసనలలో
కొట్టు కొనకోయ్! ఈగలాగ
నిజం తెలిసి, దైవ ధ్యాసతో
మసలుటే నీ ధర్మమోయ్
ప్రతిఫలంబు నీది కాదని
చేయించువాడు వేరొకండనీ
కర్మమే నా ధర్మమనుకొని
చేయునప్పుడే నీకు ముక్తి
తీవరించిన కోర్కెలతో
ఉదయించు నీకు చాల పాట్లు
ఎదిగి పోవోయ్, సంఘజీవిగ
సంఘ క్షేమమే నీకు బలగం – సంఘ బలమే నీకు క్షేమం




అంతరించ బోనీకు నీ భాష! నీ సంస్కృతి

తల్లిని గౌరవించలేని వాడు ఎవరినీ గౌరవించలేడు

తేనియ నిండిన తెలుగును నేర్పు నీ పిల్లలకు

మృదువులు చిందిన కళలను ! ప్రోత్సహించు నిండుగ

నీ సంస్కృతి, నాగరికత ! నింపు నీ చేష్టలలో

కట్టు, బొట్టు, పద్దతులను ! అనుసరించు గర్వంతో

నీ సంస్కృతే నీకు బలం ! నీ జాతే నీ మనుగడ



# అతిథి



మరచిపోతివా తెలుగు భాష ?
సంప్రదాయం, సంస్కృతి
అతిథి నెప్పుడు సత్కరించెడు
ఆనవాయితి మనదిగా
అమెరికా నడుగెట్టగానే
మరచితివా నీ పద్దతి
కసరుకొందువు ! ఈసడింపుగా
ఇంటికొచ్చిన వారిని
ఒంటరిగా ఇన్నాళ్ళు గడిపి
ఒంటి పక్షివి అయితివా
ద్వేషించితివి ఆ పద్దతిని మును
ఆ పద్దతే నీదైనదా
నిండు లోగిలే లక్ష్మి నిలయం
నిండు ఇల్లే పండుగ
మరచిపోకుము నీదు పద్ధతి
సంప్రదాయం, సంస్కృతి
గౌరవించుము అతిథి నెప్పుడు
నిండుమదితో మెండుగ

సభలకోచ్చే అతిథులందరు
మన యింట నుండుటే భాగ్యమౌ
ఇంత భాగ్యము రాదు మరల
వాడుకొనుమీ సదవకాశము
ఇదేకదా మన సంప్రదాయము
ఇదే కద మన సంస్కృతి
సాంప్రదాయం, సంస్కృతి
– పరిరక్షణే కద సభల ధ్యేయం






ఏమని అడిగేది ? యింకేమని కోరేది ?
కోరిన వాటికన్న దొరికేది కదా ఎక్కువగా
ఏమని నేనడిగేను? యింకేమని నే కోరేను?
అడిగితి కద ఒకనాడు, వైద్యుడిగా నిలచుటకు
నిలిపితివి వైద్యునిగా, అమెరికాలో నేడు నన్ను
అడుగకనే యిచ్చితివి, మనసెరిగిన తోడు నాకు
అడుగకుండ వచ్చిరి కదా ముగ్గురు పిల్లలు మాకు
నింపిరి కదా మా మనసుల, వెన్నెల చిందులు వారు
కోరిన వాటి కంటె, యిచ్చితివి ఎక్కువగా
అడుగలేను ఏమి యింక ! అడుగలేను నేను యింక !






ఏమిటో ఈ తపన
ఎందుకో ఈ ఆరాటం
ఏమిటో కొరత
ఎందులకో ఈ తహతహ
ఏదో చేయాలని
ఎన్నెన్నో చేయాలని
ఇంకేమో చేయాలని
ఆగలేని మనసెంతో
ఉవ్విళ్ళూరేను
ఎన్నో ఆలోచనలు
మెరిసేను, స్మృతి పథాన
ఏదో చేయాలని, ఇంకేదేదో చేయాలని
ఈ ఆరాటం తీరేది, ఏరోజో
ఈ తహతహ చల్లారేది ఏనాడో
నాలోని ప్రతి అణువూ
తహతహలాడేనూ !
ఎందుకో ? ఇంకెందులకో !



# ఏది మార్గము?

ఏది మార్గమొ, ఏది గమ్యమొ
తెలియదాయె నేడునాకు
ఏది తపో, ఏది ఒపో
తెలీయదాయె నేడు నాకు
మనస్సు నలజడిచేయు కర్మల
వదలివేయమని కోరె మనసు
శాంతిపధమున, ప్రశాంతి పయనము
చేయమని మరి కోరె మనసు
సంఘ సంస్కృతి పెంపుకొరకై
చేయవలసిన పనులు ఎన్నో
పిలచె రమ్మని మరల యిపుడు
శాంతి పధమున వదలి కర్మల
పోవవలెనా? చేయవలనా?
మరల నిలబడి, సంఘ బాధ్యత
తీర్చవలెనా? కడతేర్చవలెనా?
అంతులేని, సంఘ బాధ్యత,
అంతులేని సంసార బాధ్యత
అంతులేని వృత్తిభాధ్యత
ఏది ముందర,
ఏది చివరో తెలియదాయె నేడు నాకు
యిపుడు సతమతమైన మనసు
ఏమిటోమరి దీని జవాబు!




దేవుడిచ్చిన మల్లె మొగ్గవు
మనసు తెలిసిన నిండు సతివి
మమత నిండిన మాతృమూర్తివి
మనసు నిండిన వెన్న ముద్దవు
కరగి పోయే కరుణ మూర్తివి
ఓరిమికి భూదేవివే నువు
సిరులు నిండిన లక్ష్మివే నువు
నీవు మెట్టిన యిల్లు స్వర్గం
నీవు నిలచిన చోటు ధన్యం
ధన్యమైనది నాదు గృహము
నిలచిపో కళ్యాణిగా ! నిలచిపో నా తోడుగా!






ఎగసి పైబడు కోర్కెలే కద – దుఃఖ మూలం జగతికి
కోరె కైక పట్టాభిషేకం భరతునకు – బహుప్రీతితో
కోరె జానకి పైడిలేడిని – దుఃఖ కారణ మాయెనా!
కోరె ఆదమ్, ఈవులు – నిషేదించిన ఆపిలు
పడితిరి సంసార కూపపు – అగాధంలో పాపము
కోరిపెంచిన కోర్కెలే – అవును మనకు బంధము
పెంచుకొనకు, కోర్కెలను నువు – త్రుంచుకో బంధాలను
సాగించుము నీదు పయనము – నీదు ధర్మపు రీతిన
కావలయును ఆలుమగల బంధము – ధర్మరక్షణ కోసమే
పురుషునకు సతి తోడు కావలె – సహధర్మచారిణిగా మరి
పెంచకు చిన్నారులను – స్వలాభపు బంధాలతో
తీర్చిదిద్దుము పిల్లలను – స్వతంత్ర సంఘపు జీవిగ
పెంచు కొదమల విలువలతో నువు – సంఘ బాధ్యత పూర్తికై
సుదీర్ఘపు ఈ ప్రయాణంలో – బాటసారులం మనమందరం
పయనించవలె సహమిత్రునిగ – బంధాలు లేక స్వేచ్ఛగా
పూర్తిచేయుము నీదు పయనము – నీదు ధర్మపు రీతిన
మోక్ష మార్గం యిదియె కద – మన స్వేచ్ఛామార్గం యిదేగా !




లేదు మనకు ఆవేశం !
లేదు మనకు అభిమానం !
నిర్జీవమై ముదుసలివలె
మసలుతుంది మన సంఘం
ఏమయినది మన ఘనత
ఏమయినది మన యువత
నిరాశ, నిస్పృహలతో క్రుంగిపోవు నిర్భాగ్యుల
ఆర్చేవారే లేరా ! తీర్చే వారే లేరా!
మన ఘనత ఏమయినది? ఏమయినది మన యువత?
శోకించెను భరతమాత ! తల దించెను ధర్మమూర్తి
దగా కోరు, ముఠాకోరు, స్వలాభపరుల చెర నుండి
భరతమాత సంకెళ్ళను విడిపించే వారే లేరా!
భరతమాత కన్నీళ్ళను తుడిచేవారే లేరా!
భరతమాత గుండెమంట లార్పేవారే లేరా!
ఏమయినది మన ఘనత
ఏమయినది మన యువత
మేల్కొనాలి మనజాతి!
నిదుర లేవాలి మన యువత

రావాలి చైతన్యం ! మారాలి మన సంఘం
చేయాలి ఆత్మార్పణ, పని చేయాలి నిర్భీతితో
నిలబడాలి స్వశక్తితో కదలాలి ముని ముందుకు
కావాలి అభిమానం, రావాలి ఆవేశం!





# సిగ్గు !

సిగ్గు గల వారమని – అభిమానము గల వారమని
గొప్పలు చెప్పేము కద – భారతీయ సంస్కృతి యని?
అనెదము పాశ్చాత్యుల – సిగ్గులేని వారని
అర్ధ నగ్నంగా సముద్ర తీరాలలో తిరిగేరని
ఎక్కడున్న దీ సిగ్గు ? – ఎందుపోయె యీ సిగ్గు ?
పోయునపుడు మూత్రమును – నడి బజారులోన నుంచొని
చేయునపుడు మలవిసర్జన – బహిరంగముగ వీధులలో
ఎటుపోయె యీ సంస్కృతి? – ఎందుపోయె "మన సంస్కృతి?
పాశ్చాత్యుల ననేముందు తెలిసి కొనుము మన తప్పుల
సరిచేసికొనుము మన మార్గము
నిలుపుకొనుము మన సంస్కృతి.






స్వాతంత్ర్యం : స్వాతంత్ర్యం – కలదు మనకు స్వాతంత్ర్యం
లేదెక్కడ భువినెక్కడ – మనకులాంటి స్వాతంత్ర్యం !
కలదు మనకు స్వాతంత్ర్యం – బజారులో మల విసర్జనకు
స్వాతంత్ర్యం వేయుటకు – చెత్తను ఎదురింటిముందు
స్వాతంత్ర్యం, రోడ్ల మీద – అడ్డంగా తిరుగుటకు
స్వాతంత్ర్యం మన యువతకు – క్లాసులు ఎగగొట్టుటకు
స్వాతంత్ర్యం యువకులకు – యువతుల నేడ్పించుటకు
స్వాతంత్ర్యం యువతులకు – సహయువతిని వేధించుటకు
స్వాతంత్ర్యం అమ్మలకు – వరకట్నం గుంజుటకు
స్వాతంత్ర్యం మనకెప్పుడు – పొరుగును దూషించుటకు
స్వాతంత్ర్యం ఉద్యోగికి – అనుకోని సెలవులకు
స్వాతంత్ర్యం అధికారికి – లంచాలను మెక్కుటకు
స్వాతంత్ర్యం పోలీసుకు – మామూళ్ళను గుంజుటకు
స్వాతంత్ర్యం వ్యాపారికి – కల్తీలను చేయుటకు
స్వాతంత్ర్యం పాలకులకు – సుంకాలను పెంచుటకు
స్వాతంత్ర్యం ధనికులకు – నల్లధనం నింపుటకు
స్వాతంత్ర్యం లాయర్లకు – న్యాయాన్ని మింగుటకు

స్వాతంత్ర్యం వైద్యులకు – రోగులను పిండుటకు
స్వాతంత్ర్యం మంత్రులకు – వాగ్దానాలిచ్చుటకు
స్వాతంత్ర్యం నాయకులకు – పార్టీలను మార్చుటకు
స్వాతంత్ర్యం పార్టీలకు – ఓట్లు కిరాయి చేయుటకు
స్వాతంత్రం అందరికి – నిర్భాగ్యుని ముంచుటకు
ఎనలేని స్వాతంత్ర్యం – లేదుకదా వేరొకరికి
యిదియేనా గాంధీజీ – కలలుగన్న స్వాతంత్ర్యం?
యిదియేనా మననేతల – త్యాగాల ఫలం స్వాతంత్ర్యం ?
స్వార్థపరుల దురాశలకు – బలియైనది స్వాతంత్ర్యం
సిగ్గుతోడ భరతమాత – తల దించుకొనెడి స్వాతంత్ర్యం
బ్రతికివుంటే బాపూజీ – గుండె పగులు స్వాతంత్ర్యం
స్వాతంత్ర్యం! స్వాతంత్ర్యం – యింకెక్కడి స్వాతంత్ర్యం
స్వాతంత్ర్యం ! స్వాతంత్ర్యం – యిదియేనా స్వాతంత్ర్యం !






గాంధేయం నాదంటూ గాంధేయుడ నేనంటూ
తెల్లటోపీ ! ఖద్దరు బట్టలు ధరించేవు నేర్పుగా
ఒట్టి ఒట్టి మాటలతో విలువలేని చేష్టలతో
నిన్ను నమ్మిన ప్రజనంతా మోసం చేసేవు
పెద్ద పెద్ద మాటలతో బూటకపు వేషంతో
నిన్నూ, నీ ప్రజనంతను! అన్యాయం చేయబోకు
మాటకాదు గాంధేయం! వ్రాతకాదు గాంధేయం
మమతలు నిండిన నీ మనసే గాంధేయం!
కరుణతోపండిన నీ చేష్టలే గాంధేయం
నవ సమాజ నిర్మాణానికి పెద్ద మాటలుకాదు కావలె
నమ సమాజ నిర్మాణానికి కావలె పరిశుభ్రత, అహింస ;
పోవలె అస్పృశ్యత!
భావస్వాతంత్రం! హృదయ నైర్మల్యం
పరిశుభ్రతంటే బాహ్య పరిసరాలకే కాదోయ్!
ఆ మనస్సు పరిశుభ్రత నీ వాక్కు పరిశుభ్రత!
నీ ప్రవర్తన పరిశుభ్రత
అహింస అంటే కాదోయ్ తోటి మానవునకే పరిమితం
ఆ ఆలోచనలో అహింస! నీ మాటలలో అహింస !

నీ చేష్టలలో అహింస
ఆత్మబలం, ఆత్మశక్తి ! నీ స్వశ క్తిమీదే ఆధారం
నీ సుఖం, నీ సౌఖ్యం, నీ పరిసరాలవల్ల కాదు !
నీ బంధుమిత్రులవల్ల కాదు
నీ సుఖం, నీ సౌఖ్యం నీమీదే ఆధారం
స్వర్గం నరకం రెండూ నీవే దానికి కారణం!
అందరిలోను చూడు మాధవుని నేర్పుగా!
గుడిలో నారాయణుని కంటే! దరిద్ర నారాయణుడే మేలు
అన్ని కులాలను–మతాలను సమానంగా చూడు!
సమతావాదంతో నీవు
మనుషులలో, మానులలో, చెట్టులలో, పుట్టలలో
చూడు నీవు పరమాత్మను ఎంతో మరి నేర్పుగా!
ఇదే మనకు మానవీయం ! ఇదే మనకు గాంధేయం
ఇదే జాతికి శరణ్యం!





# సుస్వాగతం

వలస వచ్చితిమి అమెరికాకు రెండు దశాబ్దముల నుండి
వృత్తి, ఉద్యోగ, ఆర్థిక అభ్యున్నతి కొరకు ఆనాడు
శ్రమించితిమి రేయనక పగలనక
చేరితిమి ఉన్నత శిఖరాలకు ఈనాడు
సంతోషపడి సంబరపడే అదనులో
లేచితిమి నిదుర కొన్ని చేదు నిజాలకు
దూరమైతిరి చిన్నారులు! భాషా, సాంప్రదాయ, సంస్కృతులకు
కోల్పోయితిరి స్వాభిమాన, గౌరవంబులను
చూచితిమి చిన్నారుల అవస్థలను
స్థాపించిరి పెద్దలు అన్ని నగరాలలో
తెలుగు సాంస్కృతిక సంఘాలను
పునాది వేసితిరి తానాకు గుత్తికొండ, కాకర్ల ప్రభృతులు
జరిపితిరి మొదటి సభ స్వాతంత్ర ప్రతిమ నీడన తూర్పున
జరిగే రెండవ సభ యింధన శకట కార్ఖానాల హోరులో
జరిపిరి మూడవ సభ మహా సరస్సుల తీరాన

– నరేంద్ర వాగ్ధాటి చోటున
జరిగే నాల్గవ సభ పటోమిక్ తీరాన – రాజధానిలో
జరుగ నున్నది నేటి సభ ఒలింపిక్ ప్రతిభల దేవతల నగరాన
నిలయమే మూడురోజులు తెలుంగుల ప్రతిభలకు
విశ్వ విఖ్యాత టెర్రస్ ధియేటర్ మనకు ;
విచ్చేయుచున్నారు, పెద్దలు, కవులు, నాయకులు, గాయకులు
విజ్ఞాన ధనులు, సాంకేతిక నిపుణులు, కళాకారులు
నిండుచున్నది సభా ప్రాంగణంబు
దేశ దేశాల – రాష్ట్ర రాష్ట్రాల తెలుంగుల వెల్లువలతో
అందరికీ, మీ కందరికీ – స్వాగతం! సుస్వాగతం !
రండి, నిండుగ, మెండుగ – తెలుగు తల్లికి హారతులివ్వగా మీరు
స్వీకరించుడీ! మా ప్రత్యేక సంచిక – చిన్నారి తెలుగు పలుకును
తెలియ చేసితిమి స్వచ్ఛంద సంస్థల త్యాగనిరతిని
ప్రచురించితిమి అమెరికా తెలుంగుల సాహిత్యప్రజ్ఞ
ముద్రించితిరి ముచ్చటగ గ్లోబల్ ప్రిటింగు వారు
గైకొనుమో వేమూరి బృందపు శ్రమ ఫలంబు
విందగు రంగులతో బాపుముఖచిత్ర సొంపులతో
సమర్పించితిమి అమెరికా తెలుగు సోదరీ, సోదరులకు !
అంకితం తెలుగు తల్లికి మా తెలుగు పలుకు!






రానున్న దొక పండుగ అమెరికాలోని తెలుగులకు
జరుగనున్నదొక సమ్మేళనం తెలుగు చిన్నారులకు
భాషా, సాంప్రదాయ, సంస్కృతి పరిరక్షణకు
తెలుగు దేశపు పారిశ్రామిక ప్రగతి కొరకు
రాదు! రాదది, మరల వచ్చే రెండేళ్ళ కొకసారియె
వచ్చు నీతడవ పండుగ జూలై అయిదు నుండి ఏడు వరకు
బంగారు రాష్ట్రపు దక్షిణపు అంచున, ఒలంపిక్ ప్రతిభల లాస్ ఏంజలస్‌లో,
సముద్ర తీరాన, లాంగి బీచ్ ముఖ్య రహదారీ మొదల
నిండు నా నాడు, లాంగ్ బీచ్ సమ్మేళనపు కేంద్రమంతా
రాష్ట్ర రాష్ట్రాల, దేశ దేశాల తెలుగుల వెల్లువలతో
నిలయమై మూడు రోజులు, తెలుగు వెలుగులకు –
విశ్వవిఖ్యాతటెర్రస్ థియేటర్ మనకు
రానున్నదికదా! తెలుగుభాషా
సంస్కృతి, కవితా స్రవంతి ప్రవహించు రోజు
విచ్చేయుచున్నారు తెలుగుదేశ సారథులు, నందమూరి,
ఉపేంద్ర ప్రభుతులు
రానున్నారు ప్రజ్ఞావంతులు,

రాష్ట్ర సంస్కృతీ సాంకేతిక నిపుణులు పి.వి.ఆర్.కె, సంజీవరెడ్డి, సుబ్బారావు, వర్లు, బెనర్జీలు ఆహ్వానించితిమి. తెలుగు పెద్దలను, నీలం సంజీవరెడ్డి, నరసింహారావు అంజయ్య, వెంగళరావు, కృష్ణారావు, జమున, కృష్ణంరాజులను

వెలుగు ఆనాటి సభ నిండుగ–మంత్రివర్యులు, నాయకులు, గాయకులు పారిశ్రామిక వేత్తలు, కవులు, కళాకారులతో మెండుగ

వికసించు నచట అమరావతీ, లేపాక్షిలశిల్పకళా ప్రతిరూపాల సౌరభాలు

చూచెదరందరు కనులకింపుగ ఆంధ్రుల హస్తకళా నైపుణ్యంబుల

కొనెదరందరు, చవుకగా, వెలలేని చేనేత చీని చీనాంబరాలు

తిలకించెదముగదా! బాపూ, రామారావు ప్రభ్రుతుల చిత్రకళారీతులు

ప్రవహించునచట దాశరథి, నారాయణరెడ్డి, బాపురెడ్డి, దోణప్ప కవితా స్రవంతి

వినెదమందరము పెద్దల, పండితుల, కవుల, మేధావుల, నాయకుల ఉపన్యాసాల విన్యాసాలు చర్చించెదము మనము. తెలుగు బిడ్డల, ఆడపడుచుల కష్టనిష్టురాలు ఆలకించెద మచట వేదవ్యాసులవారి వేదాంత గోష్ఠి తెర లేచు నచట టంగుటూరి సూర్యకుమారి, జై తెలుగుతల్లీ గీతికలతో నిండుగా, కనులకు విందుగా చూచెదము, అన్ని రాష్ట్రాల తెలుగుబిడ్డల లలితకళా ప్రాభవంబు

తిలకించెదమచట శోభానాయుడు బృందపు కూచిపూడి నృత్య వైభవంబు!

వినెదమందరం, వీనుల విందుగ, చిట్టిబాబు, బెనర్జీ, రామారావుల హరికథా

బుర్రకథా, సంగీతపు మేళవంబు వీరికి తోడవును సొంపుగ, మండపాక శారద, శోభారాజుల గానసుధలు వినుపించు నచట తెలుగు నాటక పద్యాల, జానపదగేయాల శోభలు, చలపతిరావు

సుమధుర కంఠస్వరాన మైమరతు రందరు, మేనులనెల్ల, జనార్ధన్ గారి సితారు స్వరాలతో – నూకల సత్య నారాయణ శాస్త్రీయ సంగీత వీచికలకు కట్టెదము సంస్కృతీ వారధిని –

తెలుగు నాడు నుండి అమెరికాకు

అమెరికా తెలుగు కొదమల భావి భవిష్యత్తు కొరకు తరలించెదము కదా!

ఆంధ్ర భూమికి – పాశ్చాత్యదేశాల సాంకేతిక పరిజ్ఞాన సౌరభంబు

చవి చూపెదము లాస్ ఏంజలస్ తెలుగు ఆడపడుచుల వంటకపు రుచులు

చూచుచున్నారు ఎదురు లాస్ ఏంజలస్ తెలుగు వారు,

అతిథి సత్కార భాగ్యంబు కొరకు

విలువ కట్టకు సుమీ ! వెలలేని తెలుగు సోదరీ, సోదరుల శ్రమకు

విలువ కట్టకు తానా, టాస్కల కృషికి

విలువ నెంచకు వెలలేని తెలుగు కళాకారుల కళా ప్రాభవంబునకు

ఎదురు చూచితిమి యిన్నాళ్ళు ఆ రోజు కొరకు

ఆగలేమింక, రండి! రండి అందరును నిండుగ, బంధుమిత్రులతో కూడి!

రండి నిండుగ, మెండుగ తెలుగు తల్లికి హారతు లివ్వగా మీరు !

(1985 లో లాస్ ఏంజెలస్ లో జరిగిన అయిదవ తానా సభల సందర్భం)

TASK – Telugu Association of Southern California

Telugu Association of North America

